మోచేత్తో నెట్టి కళ్లతో, 'చెప్పు, తొందరగా కానీ. నాసంగతి బైటపెట్టకు' అని ఆమెకు తెలియపరచాను.

'మీరు చెప్పండిముందు' అన్నదికాంతం ముసి ముసినవ్వులు నవ్వుతూ. 'వాడుచెప్పాడుగదటే అమ్మా యీ' అన్నదిఅక్కగారు అమాయకంగా. ఆమాట మీద కాంతం 'ఆః చెప్పారు! ఏంజెప్పారు?' అని విరగ బడినవ్వటంమూలాన నారహాస్యంకాస్తా బయటపడ్డది.

అక్కగారు నావంకకోపంగా చూచింది. నేను ఏదోగొప్పతప్పుచేసినట్లు తోచింది. వెంటనే నేనన్నాను 'క్షమించండి అక్కగారూ ఇప్పుడుచెబుతాను నిజం పేరు' అని. 'క్షమిస్తానుచెప్పు' అన్నది ఆమెఆజ్ఞఇచ్చి నట్లుగా గొంతుమార్చి ఠీవిగా. 'కాంతం నేనొచ్చాను తలుపుతీయి' అన్నానుసిల్లినైపోయి. అక్కగారి ముఖం ఇంతైంది.

ఇకకాంతానిదే ఆలస్యం. 'నీవుకూడాచెప్పుతల్లీ, త్వరగావెళ్లి కాఫీతాగుదాం' అని అక్కగారు కాం తాన్ని బుజ్జగించింది. కాంతం సిగ్గుపడుతునే, ముసిముసి నవ్వులు నవ్వుతూనే '...రావుగారూనేనొచ్చాను తలుపుతీయండి' అన్నది.

అంతా పకపకానవ్వుకున్నాము. అంతవరకు బాగానేఉంది. ఇకడూరుకోవచ్చునా! కాంతానికి ఎక్కడ లేని ధైర్యవచ్చింది. సిగ్గుఅంతామాయమైనది. అక్కగారిదగ్గరకువెళ్లి, ఆమెచేయిపట్టుకొని, 'వదినా, అంతా బాగానేఉందిగాని మీతమ్ముడుపెళ్లాము పేరుచెప్పమంటే సుబ్బలక్ష్మి అని చెపటంతప్పుకాదూ?' అని అడిగింది.

'తప్పుఅమ్మా చాలాతప్పు, ఎవరు కాదన్నారు' అంటూ ఆబిడ కాంతాన్ని వంటింటివైపు నడిపించుకొనివెళ్లింది.

'అయితేమరి ఆయనచేసినతప్పుకు ఆయననేమీ అనరా?' అని అడిగిందికాంతం విసురుగా నవ్వుతూ.

అక్కగారు ఏమంటుందో విందామని సరదాపడి నేను అక్కడేనుంచున్నాను కదలకుండా. అక్కగారు మాత్రం మూడుపీటలూవేసి, మూడువెండిగ్లాసులతో కాఫీలుపెట్టి, కాంతంతో అన్నది. 'రాఅమ్మా, కాఫీ పుచ్చుకో' అని. 'మీతమ్ముణ్ణికోపపడితేగాని నేనురాను' అని కాంతం అన్నది కొద్దిగాకోపాన్ని నటిస్తూ.

'అయితే వాడి చెవులుపట్టుకొని, ఇక్కడికి లాక్కురా. అంతకంటేపెద్దశిక్ష ప్రస్తుతం అనవసరం' అన్నది మాఅక్కగారు, నవ్వుతూ.

నేను ఆమాటలువిని ఒక్కగంతులో వచ్చిపీట మీద కూర్చున్నాను. కాంతం హాసవికసితముఖియై కాఫీకప్పు ఎత్తి నాచేతికిస్తూ కొద్దిగా నాచేతిమీదవలికే టట్లు చేసింది. కాస్తచురుక్కుమన్నది. ఏమిటిది అన్నట్లు చూశాను ఆవిడవంక. 'ఆమాత్రం కాస్తచుర్రుమనటం మంచిదే' అనిఅంటూ, కాంతం ముక్కుమీదవేలువేసు కొని 'అల్లాంటిపని ఎవ్వరూచెయ్యబోకండి' అనిసవ్వింది.

ఆరోజు నేను ఎక్కడికీపోలేదు. మధ్యాహ్నం కాసేపునిద్రపోయి అయిదుగంటలకులేచి స్నానంచేశాను. అక్కగారు నాకు కొత్తబట్టలు ఇచ్చింది కద్దరుధోవతి ఉత్తరీయమూను. వానిని నేనుధరించక తప్పినదికాదు. దానితరువాత నేను ఫలహారంచేశాను.

ఫలహారంచేస్తున్నప్పుడే నేను మాకాంతాన్ని చూశాను. ఆబిడ అంతామారిపోయింది. ప్రొద్దున నేనుచూచిన మనిషికాదు. క్రొత్తపెండ్లికూతురులాగ తయారైంది, మొగాన నిలువుబొట్టు, కన్నులకుకాటుక బుగ్గనచుక్క, చెక్కిళ్లకుగంధముతో. తెల్లనిజరీచీరకట్టి, పట్టురెవికతొడిగినది. ఆమెకుకూడా అక్కగారునూతన వస్త్రాలు ఇచ్చింది. కాంతం, కాంతంలాగలేదు. పూర్వ

జన్మంలో నేనుచేసిన సుకృతములంతా మనోజ్ఞాకృతి దాల్చి నాయెదుట నిలిచినట్లుఉన్నది.

తివాసీపైన నన్ను కూర్చోమన్నది అక్కగారు. నాకుఎదురుగా కాంతాన్ని కూర్చోబెట్టింది. మేము బంతులాడాలట! ఇది అక్కగారిసరదా!

కాంతానికి ఎక్కడలేనిసిగ్గూవచ్చింది. లజ్జతో కాంతం తలవంచుకొంది. నేను ఆమెచిన్నిగడ్డాన్ని మునివ్రేళ్లతోతాకి, తలఎత్తి 'అల్లాసిగ్గుపడవద్దు' అన్నాను. కాంతం మరీసిగ్గుపడ్డది. మందారపుష్పముల కాంతిచ్ఛటలు ఆసొగసులాడి చెక్కిళ్లపై భాసిల్లినవి. ఆమెదృక్కులు ప్రసరించినంతమేర ఎర్రతామరలు పూచినవి.

పూలచెండును అక్కగారు మాయిద్దరిమధ్య పెట్టి ఊరుకొన్నది. కాంతం మాట్లాడలేదు. దానిని ముట్టుకోనూలేదు. అక్కగారు నావంకచూచి 'నువ్వే ముందువిసురు' అన్నది. నేను చెండును కాంతం చేతుల్లోపడేశాను. ఆమెతిరిగి దాన్ని నాచేతుల్లోపడేసింది. ఆమెను తాకివచ్చిన కారణంచేత ఆపుష్పగుచ్ఛము నాశరీరానికి గగుర్పాటుకలుగజేసింది. నావళ్లు ఝల్లుమన్నది.

ఆల్లాంటి ఆనందం మళ్లీనేను అనుభవించలేదు. నేనుచెండును ఆమెపైకి విసిరాను కాంతం తిరిగి ఆచెం డును విసిరింది. అది ఈపర్యాయము నావక్షస్థలానికి తాకింది. నేనుదానిని ఆమె వక్షోజాలవైపునకు విసి రాను. అక్కగారు పకపకానవ్వింది. నేనూనవ్వాను.

కాంతానికి సిగ్గూ కోపమూ, కలిసివచ్చినవి. ఆమెపూగు త్తిని ఎ త్తినాచెవికి తగిలేలాగునవేసింది. 'అంత కొంటెతనంకూడదని పెండ్లికూతురు నీతోచెప్పమన్నది' అని ఆచెండు నాచెవిలో రహస్యముగాచెప్పి, ఏమీ ఎరగనట్టు నాఒళ్లోకూర్చున్నది.

'నేను తగినజబాబు చెప్పు పో' అని ఆచెండును మళ్లీ ఆమెచెవికి తాకేలాగున విసిరివేసాను. అది కాం తంతో ఏమిచెప్పిందో ఏమో, మొత్తంమీద కాంతం మెత్తబడి నవ్వింది. నేనూనవ్వాను. ఈనవ్వులేరాజీకి షరతులు. ఆతరువాత అక్కగారు కాంతంచేత నాకు గంధం పూయించింది. నేనూకూడా మాఆబిడగడ్డానికి, బుగ్గలకు, కపోలాలకు ముంజేతులకు గంధంపూశాను.

ఆతరువాత భోజనాలు. అప్పటికి చక్కటివెన్నెల వచ్చింది. ఒకేవెండికంచండుందక్కడ. ఎదురుబొదురుగా

పీటలు వేసిఉన్నవి. నేను ఒకపీటమీద కూర్చు న్నాను. నాకు ఎదురుగాఉన్న పీట ఇంకాఖాళీగానేఉంది.

కాంతం ఎక్కడఉండాలని నేనుముందుకుచూస్తు న్నాను. గదిలోనుంచి వస్తుందని నా ఊహ. అక్క గారు నాఊహలుగ్రహించి 'నీవెనకాలెఉందోయ్ ఏం వెదుకుతావు!' అన్నది.

ఆమాటనిజమే! నావెనుకనేఉంది. కాంతమే! క్షీరసాగరోద్భూతమైన అప్సరఃకన్య లాగున్నది. ఆమె చంద్రికాధిదేవత. మనోహరంగాఉంది. ఆమెకన్నులు ప్రసన్నములైన వెన్నెలలను వెలువరిస్తున్నవి. ఆమె మందహాసము శీతలజ్యోత్స్నావీచికలను వర్షిస్తున్నది. ఆమె అంతా తెలుపే. క్షీరసాగరవినిర్గత తరంగం ఒక్కటి అక్కడ నిలిచినట్లుగాఉన్నది. ఆమె పాదముల అంచులు మాత్రము ఎర్రగాఉన్నవి. పాదముల కామె పారాణిపెట్టినది. ఎర్రతామరపై ఆమెనిలుచున్నట్లుంది.

నేను 'రా కాంతం' అన్నాను. ఆమెసిగ్గుపడి కదల లేదు. అక్కగారు ఆజ్ఞాపించినట్లు 'రా వేమే' అన్నది. కాంతంవస్తుంటే వెన్నెలపాయలై దారి ఇచ్చినట్లు తోచినది.

అన్నంకలపటం కాంతంవంతు. కలిపి నాసగభాగం నావైపుకునెట్టితే నేను తిన్నాను. ఆమెకూడా తిన్నది. పెరుగూఅన్నం రావటంతోనే నాభాగంనేను గబగబా తినేసి, ఆచెయ్యి ఆమెబుగ్గలకుపులిమి, వెళ్లిపోయి చెయి కడుక్కున్నాను.

అక్కగారు ఇదిచూడనట్లునటించి 'ఏమే, పిల్లా. అదేమిఆగడమే! పెరుగుబాగుంటే ఇంకా రెండుముద్దలు తినాలెగాని, అదేంపనమ్మా ఒంటినిండా పూసుకొంటు న్నావూ!' అన్నది. కాంతంనవ్వి మీతమ్ముడు సరిగ్గాతిన కుండా లేచిపోయినారు చూశావా వదినా అన్నది.

'అయితే-?'

'వారికోసమే కాస్తబుగ్గలకు పూసుకొన్నాను' అన్నదికాంతం. ఈచమత్కారానికి అంతానవ్వినాము.

భోజనాలు అయిపోయినని. అక్కగారు 'ఒరే తమ్ముడూ నీవుడాబాపై కెవెళ్లు. మీ ఆవిడొచ్చి తాం బూలం ఇస్తుంది' అన్నది.

నేను పైకివెళ్లి పచార్లుచేస్తూ ఆ వెన్నెలవైభ వాన్ని చూస్తూఉన్నాను. అక్కడ రెండుతెల్లనిపక్కలు ఉన్నవి. ఇంతలో అక్కగారు మరదలును వెంటబెట్టు కొని పైకివచ్చింది. అక్కగారూ కాంతం ఒకమం

చంపైని కూర్చున్నారు. నేను ఒకమంచంమీద కూర్చు న్నాను.

ఏదోమాటలువచ్చి అక్కగారు, 'నాయినా ఈకాంతాన్ని ఎక్కడదొరికించుకొన్నావు?' అనిఅడిగింది. 'నందనవనంలో కనపడితే పెండ్లిచేసుకొని తీసికొనివచ్చా నండీ' అక్కగారూ అన్నాను. అక్కగారు కాంతం చెక్కిళ్లునిమిరి 'అదృష్టవంతురాలవు. మాతమ్ముణ్ణిచేసు కొన్నావు. చేసుకోకపోతే ఏంజేసేదానివి' అన్నది. కాం తం సిగ్గుపడి తలవంచుకొని 'ఎందుకు చేసుకోరూ!' అన్నది.

అంటే చేసుకోవటం చేసుకోకపోవటం మన చేతుల్లో ఉన్నవిషయం కాదన్నమాట. కాంతం తెలివి తేటలనుజూచి అక్కగారు మహోల్లాసంతో నవ్వి, ఆమెను హృదయానికి గట్టిగా అదుముకొన్నది.

ఆసమయానికి కాంతానికి ఆవలింతవచ్చింది. ఒక చిటికకూడావేసింది. అక్కగారు 'మీరు పడుకొని నిద్ర పొండి' అంటూ లేచి మెట్లవైపునకునడిచింది. కాంతం కూడా ఆమెగారివెంటనే నడుస్తున్నది.

కాంతంకూడా అక్కగారితో వెళ్లటంజూచి నేను తెల్లపోవటం అదృష్టవశాత్తు ఆవెన్నెలలో ఎవరునూ

చూడలేదు. నేను కాంతంకొంగుపట్టుకు లాగటంకూడా ఎవ్వరూ చూడలేదు. అయినా కాంతం అక్కగారితో వెళ్లుతున్నది. ఇంకా మాట్లాడుతూ కూర్చుంటారు కామాలు. ఇక ఆ మాటలకు తెరిపి ఎప్పుడో!. ఆబిడ మళ్లీ రావటం ఎప్పుడో! ఇల్లా అనుకొనే నేను మన స్సులో కష్టపడుతూఉంటే, పైగా కాంతం 'నేనుకిందికెళ్లి, వదినతో మాట్లాడి అక్కడేపడుకొంటా'నని అన్న ప్పుడు నాగుండె ఎంతకొట్టుకొన్నదో, ఆపరమేశ్వరుడికే తెలుసు.

నిజంగా కాంతం వెళ్లుతునేఉంది. వెనక్కుతిరిగి మళ్లావస్తానని సంజ్ఞ చేస్తుందేమో అనుకొన్నాను. అల్లా చేయకుండానే వెడుతున్నది. ఆ అసామాన్యమైన సంఘ టన నామనస్సుకు అతిదారుణమై తోచింది.

అప్పుడు నేను 'అల్లాగేచేయికాని ఇదితీసికెళ్లి క్రిందపెట్టు' అన్నాను. కాంతం 'ఏమిటండీఅది? అన్నది' అక్కడే నిలబడివుండి. 'అక్కడేఉండి కేకలువేస్తే ఎల్లాగూ? ఇదిచూశావూ, దీన్నితీసికెళ్లి బహుజాగ్ర త్తగా బీరువాలోపెట్టు' అన్నాను.

కాంతం నిజమే అనుకొని తిరిగివస్తున్నది వదినా ఇక్కడేఉండు వస్తానని చెవుతూ.

కాంతం ఇటుతిరగటంతోనే అక్కగారు మెట్ల తలుపు రవీమనివేసి, నవ్వుకుంటూ వెళ్లి పోయింది.

# 5

కాంతం తమ్ముడింటికి వెళ్ళి నాలుగు నెలలు అయింది. ఆవిడ తెనాలిలో, నేను బెజవాడలో ఉన్నాము. ఆ నాలుగు నెలల్లో ఒక్కసారి అయినా మా ఆవిడను చూడటానికి నేను తెనాలి వెళ్ళటంపడలేదు. అంత అవసరమూ లేకపోయింది వారానికి ఒకఉత్తరం వస్తూఉండటం మూలాన.

ఫాల్గుణమాసం వచ్చింది. ఆరోజులలో, సాయంత్రం వేళ కృష్ణనీళ్ల చల్లదనాన్ని దొంగిలించుకొనివచ్చి, పేదగుండెలకు పంచిఇచ్చే చల్లనిగాలీ, విచ్చీవిచ్చని మల్లె పూవుల్లో దాక్కొని ఉన్న పరిమళమూ, హృదయదళాలను తోసికొని బైటపడి, అల్లరిగా అందరిముఖాల పైనా ఉఫ్అని ఊదటంవల్ల కలిగిన హాయీ, దాంపత్య తపోఫలితంగా, భార్యాభర్తల ఇద్దరి సుగుణాలూ పోణికి పుచ్చుకొన్న సంతానంలాగు, నీళ్లు మృత్తికాఘటంతో సహాచర్యంచేసి తత్ఫలితంగా పొందిన చల్లదనమూ, నాలో ఏవో వింతవింత భావాలనూ, విరహాన్నీ రేకెత్తించినవి.

కాంతాన్ని తీసికొద్దామని బయలుదేరాను. రైలు బయలుదేరబోతున్నది పరుగెత్తుకొనివెళ్లి ఎక్కి కూర్చున్నాను.! బండిబయలుదేరటానికి ఆపసోపాలూ పడి, అతికష్టంమీద కదిలి గర్భిణీస్త్రీలాగ ముక్కుతూ మూల్గుతూ నడిచింది ఆరోజున.

బండిదిగి ఇంటికివెళ్లేసరికి కాంతం ఏంజేస్తూఉం టుందో! తెల్లటిమల్లెపూలు పెట్టుకొని, తెల్లనిరవిక తొడుక్కొని తెల్లనిచీరకట్టుకొని నాకు ఎదురుగా వస్తుందా? వచ్చి తన రెండుచేతులూ నామెడకుచుట్టవేసి ఆలింగనంచేసుకొని, నాప్రియమైనభర్తా, నేను నిన్ను ప్రేమిస్తున్నాను అనిఅంటుందా దొరసానిలాగు.! ఇల్లాగ అనుకుంటూ కూర్చున్నాను.

బండిదిగి ఇంటికివెళ్లాను. మాకాంతం నాకెదు రుగా రాలేదు. మామరదలువచ్చి కాళ్లుకడుక్కునేం దుకు నీళ్లుఇచ్చింది.

మామహారాణి ఎక్కడోదాకున్నది. వెంటనే ఎదటబడి నేనునిన్ను ప్రేమిస్తున్నానని అని అనటంలో కంటే, ఇల్లాగ దాక్కొని మనకోరికను బలీయంచేయ డంలో అందం ఉందా ఏమిటబ్బా! అనిపించింది.

డ్రాయింగ్ రూములో కుర్చీలో కూర్చుని కాసేపు
మాబావమరిదితో మాట్లాడాను. వాడు ఆసుపత్రికి
వెళ్ళిపోయినాడు. నేను ఒంటరిగాణ్ణి అయిపోయినాను.

ఇకనాకు ఏమీపనిలేకపోయింది. ఎక్కడైనా,
వైపునఅయినా కనకకంకణ ఝుణఝుణత్కారధ్వనులు
ఎనవ స్తయ్యేమోనని చెవులురెండూ అప్పగించి కూర్చు
న్నాను.

మా పెద్దఅత్తగారు అప్పుడు అక్కడేఉంది.
విడవచ్చి పలకరించి క్షేమసమాచారం అడిగి వెళ్ళి
పోయింది. సుందరమ్మగారు వచ్చి పలకరించి నవ్వి
ంటూ వెళ్ళిపోయింది. సత్యవతమ్మగారు 'కాంతం
మొగుడొచ్చాడట ఏడీ!' అంటూ నాదగ్గరకువచ్చి
నువ్వేనాబాబూ, మానాయినే, కూతుళ్ళతండ్రివిగా
ంటూ దీవించి వెళ్ళిపోయింది. పడుతూలేస్తూ, పంక
మ్మగారుకూడావచ్చి, 'నాయినా పిల్ల నాలుగునెలల
ంచీ ఇక్కడుంటే, ఒక్కసారిఅయినా వచ్చిచూచి
వెళ్ళడానికి నీకు తీరికఅయింది కాదుకామాలు!! రేపు
కు కూతురుపుడితే అప్పుడు తెలిసొస్తుందుండు' అని
యపెట్టి వెళ్ళిపోయింది. మాఆవిడ కాపరానికివచ్చి
ప్పటినుండి ఆడవాళ్ళంతా నన్ను ఇల్లాగఅంటూనే

ఉన్నారు. ఇల్లాంటిదీవనలూ, బెదరింపులూ నాకు అలవాటై పోయినవి. అల్లాంటప్పుడు నేను నవ్వి ఊరు కుంటూ ఉండేవాణ్ణి. ఆరోజునా అల్లాగేచేశాను. ఇంతకూ ఆవిడమాత్రం నాకళ్లకు కనపడలేదు. ఆవిడరాకకోసం మీనమేషాలు లెక్కపెడుతూ కూర్చున్నాను.

ఇంతలో దూరాన ఒక మెఱుపు మెఱిసింది. ఉలిక్కి పడిచూశాను, కాంతంవస్తున్నది. నిరీక్షణవల్ల బలపడిన కోరిక, ఆవిడఆగమనసౌఖ్యాన్ని తృప్తిగాఅనుభవించింది.

కాంతంవచ్చి కాఫీకప్పు బల్లమీద పెడుతూ "కులాసాగాఉన్నారా? రావటానికి తీరికేలేకపోయింది కామాలు ఇన్నాళ్లబట్టీ" అన్నది.

ఈమాటలు అంటానికి ఆవిడగారికి ఒకహస్త విన్యాసమూ, ఒక అపూర్వభంగిమమూ ఒకబాష్పాంబు పూర్ణ నయనమూ, క్షణక్షణత్ సంచలిత్ వీక్షణపరంపరా తోడైనవి. ఔత్సుక్యము, లజ్జ, హర్షము, కోపము ఇంకా ఎన్నోభావాలుకూడా, సాహాయ్యానికి వచ్చినై. ఇంతపెద్ద రాణువతో అవిడగారు నాపై దండయాత్ర సాగించింది. నేనుఓడిపోయి ఒక్కచిరునవ్వుతో ఆమెకు లొంగిపోయినాను.

నవ్వితే ఆవిడ బుగ్గపైన గుంటపడ్డది. అదివరకు ఎప్పుడూ నేను అల్లాంటియేర్పాటు చూడలేదు. చాలా ఆశ్చర్యంకలిగింది. అసలు మనిషిమనిషంతాకూడా ఏదోకొత్తగాఉంది. కాస్తలావు అయినట్లుంది. వన్నె వచ్చింది.

ఆమెనడకలో పూర్వపుచలాకీలేదు. చూపులలో మాంద్యం, నడకలో ఠీవి వచ్చినవి. ఇదంతానాకు చాలా కొత్తగాఉంది.

నేను కాఫీతాగుతున్నంతసేపూ ఆవిడ అక్కడే కుర్చీకి కాస్తఆనుకొని నుంచుని మాట్లాడింది. మా:స లమ్మగారు ఎందుకోవచ్చి మమ్మలనుచూచి దూరాన్నుంచే, గిరుక్కునతిరిగి వెళ్లిపోయింది.

నేను తెల్లపోయిచూశాను మాఆవిడవంక. ఆవిడలో ఏమిమార్పువచ్చిందో, సరిగ్గా, నేనుగుర్తించలేక పోయినాను. ఏదో కొత్తదనము ఉందని మాత్రము తెలుసుకొన్నాను. కాని అదిఏమిటో తెలిసిందికాదు.

'ఏం, అల్లాగఉన్నావేం!' అన్నాను. 'ఎల్లాగ ఉన్నానూ?' అని అంటూ ఆవిడ తన శరీరాన్ని అంతటా చూపులతో తాకిచూచుకొన్నది. చూచుకొని మళ్లీ సిగ్గుతోనవ్వింది. చెక్కిలిగుంటలు పరచుకొన్నది. ముఖం

అంతా కాంతితో కళకళలాడింది.

ఆవిడ తిరిగి వెళ్ళిపోతున్నది. ఆవిడచూపులో, ప్రసన్నత, గర్వం, కృతజ్ఞత అన్నీఉన్నవి.

మరోఅయిదునిమిషాలు జరిగిపోయినై. ఆమె కపోలములను తాకివచ్చిన శీతలపవనము నాశరీరంలోని అన్నిభాగాలను తాకుతూ నాకు చక్కలిగింత పెట్టింది.

ఆవిడతో ఒకముఖ్యమైన విషయము చెపటం మరిచిపోయినట్లు నాకు అప్పుడు జ్ఞాపకంవచ్చింది. వెంటనే మామరదలును పిలిచి 'చూడు, పిల్లా, మీఅక్కయ్యను ఒకసారి రమ్మను' అన్నాను.

అది తుర్రునపరుగెత్తికెళ్ళి, క్షణంలో మళ్లీపరుగెత్తుకుంటూవచ్చి అక్కయ్యకనపడలేదు అన్నది. 'కనపడకపోవటం ఏమిటే? గదిలోఉంటుంది చూడు' అన్నాను. 'అయినా ఇప్పుడు అదిరావటం ఎందుకూ?' అనిఅడిగింది. 'నీముఖం, నీకెందుకూ?' అన్నానునేను. ఈమాట అన్నానని దానికి కోపంవచ్చిందో ఏమో అది అక్కడనుంచి కదలలేదు.

దాన్ని కాస్త మంచిచేసుకోకపోతే లాభంలేదని తోచి 'అదిగాదే శకుంతలా, మీఅక్కయ్యతో ఒక ముఖ్యమైన విషయంచెప్పాలె. ఇందాక చెపటం మరిచి

పోయినాను. ఒక్కమాటు కాస్తరమ్మను.' అని బ్రతిమి లాడినట్లు చెప్పాను.

అది కానేపు ఆలోచించి, తన తెలివినంతా ఉప యోగించి చివరకు 'బహుశః అదిరాలేదు బావా, నీవే వెళ్ళు,' అని మహాపెద్దనాపసానిలాగ నాకు హితబోధ చేసింది.

నాకు కోపమూవచ్చింది, ఆశ్చర్యమూకలిగింది. 'రాలేకపోవటం ఏమిటే, వంట్లోసుళువుగాలేదా?' అని అడిగాను. 'ఎట్లాఉంటుందిబావా!' అని ఆపిల్ల తుర్రున పిట్టలాగ పరుగెత్తిపోయింది.

నాకు ఏమీ అర్థంకాలేదు. వంట్లో సుళువుగా లేకపోవటం ఏమిటి? నేను ఈనాలుగునెలలనుంచీ రాక పోవటం మూలాన బెంగపెట్టుకొందికాబోలు. అందు కనే ఆరోగ్యం చెడిపోయి ఉంటుంది. అయినా బెంగపడి కృశించినదానిలాగు లేదే అనుకొంటూ కూర్చున్నాను. ఇంతలోకే లోపలినుంచి స్నానంచెయ్యమని కబురు వచ్చింది. నేను స్నానంచేసి వెళ్ళేసరికి వడ్డన అయ్యే ఉంది. నేనుకూర్చున్నాను. వడ్డించిన పదినిమిషాలకు కాంతంకూడా నెమ్మదిగా వచ్చికూర్చున్నది.

మా అత్తగారు ఆవిడదగ్గరకువెళ్లి ఏమేమోవడ్డించింది. 'నీకోసంచేశానే అమ్మా ఈ చింతపండు పచ్చడి, కాస్త నాలిక్కురాచుకో, నిమ్మకాయబద్దతోనైనా ఓముద్దతినమ్మా' మజ్జిగపులుసు రుచిగాఉంది కాస్త వేయించుకో' అని బ్రతిమిలాడుతున్నది.

ఈవిడను ఇంతగారాబం చెయ్యటంచూస్తే నాకు చాలా ఆశ్చర్యంకలిగింది. తనకు పుట్టింట్లో ఎంతహంగు ఉందో నాకుచూపటానికి కాంతం ఆడుతున్న నాటకమా ఇది అని అనుమానంకలిగింది.

ఈసంగతి ఏమిటో తెలుసుకుందామని మా అత్తగారిని అడిగాను 'ఏమండీ అంత బ్రతిమిలాడకపోతే ఆవిడగారు తనకుకావ్వలసింది ఏదో అడిగి వేయించుకొని తినదా' అని.

ఆవిడ 'అయ్యో, బ్రతిమిలాడకపోతే ఎల్లాగ నాయినా, ఏదో ఓముద్దఅయినా లోపలికి పోవాలా' అన్నది.

ఎందుకు పోదబ్బా! ఇదివరకు మాఇంట్లో ఉన్నపుడు ముద్దబాగానేపోయేదే? అని ఆశ్చర్యపడి ఆడవాళ్లకు పుట్టింట ఉన్నపుడు ఇల్లాంటి వికారంఏర్పడు

తుంది కామాలునని మనస్సుకు సమాధానం చెప్పుకొని ఊరుకొన్నాను.

నేను ఆమెగారి గదిలోకివెళ్లి 'ఏమిటి ఇదంతాను?' అని అడుగుదామనుకొన్నాను. మళ్లీ అనుకొన్నాను ఎందుకూ అడగటం! తెలుస్తునేఉంది ఆవిడ దొరసాని పోకిళ్లు అని.

నాకు ఆ హాల్లోనే పక్క ఒకటివేశారు. కాసేపు పడుకొని విశ్రమించాను. కాని నిద్రపట్టలేదు. ఈవిడ సంగతే ఆలోచిస్తూ పడుకొన్నాను.

ఆబిడను అంతా మహారాణిలాగ చూస్తున్నారు. అవతలచెంబు ఇవతల పెట్టనీయటంలేదు. 'నీవు ఊరుకోవే! ఈవంగటం లేవటం నీకెందుకేతల్లీ! నీవు వెళ్లి పడుకో.' ఎంతసేపటికి ఇల్లాంటిమాటలే వినపడుతున్నవి.

అప్పటికి సాయంత్రం నాలుగుగంటలైంది. దగ్గరున్న కాఫీహోటలుకెళ్లి ఒక్కఅరకప్పు కాఫీ తాగుదామనుకొన్నాను. పర్సు ఆవిడదగ్గరనేఉంది. ప్రొద్దున నాకు కాఫీ ఇయ్యటానికి వచ్చినపుడు ఆమెకు పర్సు ఇచ్చాను జాగ్రత్తగా దాచిపెట్టమని.

మామరదలు ఆరోజున ఎందుకో మహావాడావుడిగా తిరుగుతున్నది లోపలికి బైటికీ. దాన్నిపిలిచి

‘ఇదుగో, పిల్లా మీఅక్కయ్యను అడిగి రెండురూపాయలు తీసుకొనిరా, నేను కాస్త బజారుకువెళ్లాలె,’ అన్నాను.

అదివెళ్లి, చిచింద్రలాగ పరుగెత్తికొనివచ్చి అక్కయ్య పెట్టెలోఉందట నీపర్సు, నిన్నేవచ్చితీసుకోమంది, అని గిరుక్కునతిరిగి వెళ్లబోతున్నది. నేనుదాని జడపట్టుకొనిలాగి నిలవేసి ‘అయితే ఏమిటాపరుగెత్తటం. తాళంచెవి ఏదీ?’ అన్నాను. ‘దానిదగ్గరేఉందికామాలు వెళ్లి అడుగు?’ అని తప్పించుకొని పారిపోవటానికి ప్రయత్నంచేసింది.

జడవదిలేసి, చెయ్యిపట్టుకొని ‘మీఅక్కయ్య గదిలోకి దారిచూపవే భామా?’ అన్నాను. అది నాచెయ్యి వదిలించుకొని, వెనక్కు వెళ్లి నన్ను తోస్తుకుంటూ తీసికొనివెళ్లింది వాళ్లఅక్కయ్యఉన్న గది దగ్గరకు.

నేను గదివాకిటిముందు నుంచున్నాను. కాంతం హంసతూలికాతల్పంపైని శయనించిఉన్నది. బహుశః నిద్రలో ఉండవచ్చు. ఎందుకంటే నన్నుజూచి లేవలేదు.

నేను ఇంకాగదివాకిటిముందే నుంచుని ఆలోచిస్తున్నాను. ఏమిచెయ్యాలె? ప్రబంధనాయకుడు అయితే

ంద్రామదమత్తురాలైన ప్రియురాలి వక్షోజానికి తగిలే టట్లుగా ఒకకోరకాన్ని విసురుతాడు. అప్పుడు ఆవిడ లేస్తుంది. అల్లాంటి సామాగ్రి నాదగ్గరలేదు. మరి ఏమి చెయ్యాలా అని ఆలోచిస్తున్నాను. ఇంతలో మామర దలు నేను లోపలికివచ్చివడేటట్లు ఒక త్రోపుతోసి వెళ్లి పోయింది.

మాకాంతం మేలుకొనే ఉంది. నన్ను చూచి ప్రేమతోనవ్వింది. ఆనవ్వు వెలుగులో ఇంకోనాలుగు నెలలు ఒంటిరిగా జీవించగలనని తోచింది.

ఆబిడ మాట్లాడలేదు. నా ఆగమనాన్ని నిరీక్షి స్తున్నట్లూ లేదు. ఆ అర్ధనిమీలిత నేత్రాలలో ఏవిధమైన కాంక్ష కనపడలేదు. అలసత్వమూ, మాంద్యమూ, మౌగ్ధ్యమూ ఆమెకళ్లలో గోచరిస్తున్నవి.

ఆబిడకు కోపం వచ్చిఉంటుందా అని అనుకొని, ఆలోచించి, అది కోపంమటుకు కాదు అనే నిశ్చయానికి వచ్చాను. మరి ఎందుకు ఇల్లా తమాషాగా ప్రవర్తిస్తు న్నదో తెలియలేదు. సరే బజారుకువెళ్లి కాఫీతాగుతూ ఈవిషయాన్ని గురించి తీరికగా ఆలోచించుకొందాము అనుకొని 'కాంతం, ఫర్సు ఏదీ?' అన్నాను. ఆమె మాట్లాడ

కుండా పెట్టెవేపు వేలుచూపింది. గదికొంచెం చీకటిగానే ఉంది. కాని ఆమె చిరునవ్వు వెలుగులో ఆపెట్టెఎక్కడ ఉందో నాకు కనిపించింది. తాళంచెవికావాలె అన్నాను. ఆమె మళ్లీ మందంగానే నవ్వుతూ తన మెడలోఉన్న, బంగారపుగొలుసు చూపింది. తాళంచెవి అక్కడఉంది. అక్కడనుంచి తాళంచెవితీసికొని పెట్టెతీసి నాకు కావలసిన డబ్బు తీసుకొన్నాను.

కాంతం నావంక జాలిగాచూచింది. ఈరోజుకు ఆచూపు నాకళ్లల్లో మెదులుతుంది. అంతకుముందు ఎప్పుడూ అల్లాంటిచూపు నేను చూడలేదు. అవి ప్రణయదృక్కులుకావు. ప్రసాద దృక్కులు. తృష్ణతో కూడి గుచ్చుకొనేవికావు. అనుకంపము కలిగిస్తున్నవి.

నేను చకితుడను అయినాను. ఏదో విచిత్రమైనదీ, అనిర్వచనీయమైనదీ అయినట్టి భావన నాలో ఉత్పన్నమైనది.

నేను కాంతాన్ని సమీపించి, చెక్కిలిపై చెయి వేసి 'కాంతం, ఏం, మహాదర్జాగాఉంది. నీవ్యవహారం! పెద్ద మహారాణివై పోయినావు' అన్నాను. ఆవిడ మాట్లాడక మందహాసం చేసింది.

నేను కాంతం పడుకొనిఉన్న పక్కపై కూర్చుని, నిట్టూర్పు తాకుడువలన కొద్దిగా వాడిన ఆమె మధురాధర పల్లవాలను, తెల్లబడిన ఆమె కపోలాలను చూస్తున్నాను. ఆమె ప్రమోదంతోనూ, అనురాగంతోనూ నావంక చూచింది.

నేను కాంతం పడుకొనిఉన్న ప్రక్కలో కొంచెం ముందుకు జరిగి, ఆమెకు అటుప్రక్కగా నా చెయ్యిని ఆనించి, ఆమెపై వంగి ఆలింగనం చేసుకోపోయినాను. ఆమె అందుకు అంగీకరించక సిగ్గుపడ్డది.

నాకు అప్పటికీ ఏమీ అర్థంకాలేదు. కాక ఇంకా ఆమెను సామాన్య దృష్టితోనే చూస్తూ, 'ఏం అల్లాగు ఉన్నావు కాంతం' అన్నాను దిగులుగా. 'ఊరికేనే' అంటూ ఆవిడ కొంచెము అవతలకి జరిగిందిముసిముసి నవ్వులు నవ్వుతూ.

ఆచూపుల్లో, ఆ అలసత్వంలో, నాకు ఏదో మహాత్మ్యం గోచరించింది. అప్పటికి తోచింది నాకు లోకపుసంగతి కొంత. ఏదో అనుమానంకలిగింది. నేను ఆవిడ ముఖావలోకనం చేస్తూ మళ్లీ అడిగాను 'కాంతం ఏమిటిది?', అని. ఆవిడ కళ్లుమూసుకొని 'ఏముందీ!' అన్నది.

ఏదో సంతోషపు పొంగులో ఆవిడ ఊదుతూ ఉన్నట్లు తోచింది; నేను ఆవిడగారి మృదువైన చెయ్యి పట్టుకొని 'అయితే ఏమన్నా!...' అని ఆవాక్యం పూర్తిచేయకుండా ఊరుకొన్నాను. ఆవిడ ముసిముసి నవ్వులు నవ్వింది. నాబిక్కచూపులు చూచి మరీ నవ్వింది.

నాకేదో భయం వేసింది. ఏదో పెద్ద బాధ్యత, బరువుగా నాపైపడ్డట్లు అయింది. నేను ఏదో వింతగా కాంతంవంక చూస్తూ 'అయితే...' అనిఒకముక్క అని ఆపైన ఏమీ అనలేక పోయినాను. నా అవస్థ అంతా కాంతం గ్రహించి తనరెండుచేతులూ నామెడపైని వేసింది సిగ్గుపడుతూ. నేను ఇంకా భయపడుతూనే ఉన్నాను ఏదో ఆనందంకూడా పైకి ఉబుకి వస్తున్నా.

కౌగిలివదలి కాంతం తనరెండు చేతులతోనూ ముఖం కప్పుకొని పకపకనవ్వింది. నేను ఆవిడచేతులను తీసివేసి ముఖంలో ముఖంపెట్టి చూశాను. కాంతం మళ్లా తన అరచేతులను ముఖంపైన కప్పుకొని సిగ్గుతో నవ్వింది. చాలాసిగ్గుపడుతున్నది కాంతం.

నాసందేహం అప్పటికి సగంతీరింది. అయినా అడిగాను లేచినుంచుని 'అదేనా?' అని. కాంతం లజ్జా భారంచే అవనతముఖియై తల ఊపింది.

ఎవరో వచ్చినట్లు అలికిడి అయింది. వెనక్కు తిరిగి చూశాను. మామరదలు అక్కడ నిలబడిఉంది. గడుసుపిల్ల నామాటలు విన్నట్లుంది.

అది నుంచున్నది నుంచున్నపాటున విరగబడి నవ్వింది. నేను తెల్లపోయినాను ఇది ఇల్లాగ ఎందుకు నవ్వుతుందా అని. ఎందుకే నవ్వుతావు అన్నాను. అది మరీనవ్వింది. వాళ్ల అక్కయ్య అడిగింది ఎందుకే అమ్మాయి నవ్వుతావూ? అని. ఆపిల్ల నవ్వు ఆపుకొని అక్కయ్యా, అదేనా? అని మళ్లీ విరగబడి నవ్వింది.

ఇంకా ఆపిల్ల ఊరుకోలేదు. ఇల్లంతా గంతులు వేసింది. వాళ్ల అమ్మమ్మ, బామ్మ, అత్తయ్య ముసలమ్మ, అందరిదగ్గరకూవెళ్లి, నేను అన్నమాట, నేను అన్నపద్ధతిలో, నన్ను వెక్కిరిస్తూ, 'ఏం అదేనా? ఏం అదేనా?' 'ఏం అక్కయ్యా, అదేనా?' అంటూ నానా అల్లరీచేసింది ఆసాయంత్రం అంతా.

ఆరోజు సాయింత్రం ఆరుగంటలబండికే నేను తిరిగి బెజవాడకు ప్రయాణమైనాను మరునాడు బడి ఉండటం మూలాన. నేను మళ్లీ కాంతాన్ని ఇంకొకసారి కలుసుకొన్నాను వెళ్లి వస్తానని చెప్పటానికి.

వెళ్లి వస్తానని చెప్పాను. 'ఇంకొకపూట ఉండరా' అన్నది. నేను మరునాడు ప్రొద్దునే స్కూలుకుపోవాలి సిన అగత్యాన్ని గురించి చెప్పాను.

కాంతం విస్తారం మాట్లాడలేదు. నావంక అతి జాలిగా ఒకచూపుచూసింది. మధురాతి మధురమై, అమృతమయమైన ఆచూపు ఈశుష్క జీవితానికి అంతా బలాన్ని సంతోషాన్ని ఇయ్యగలిగింది. కాంతం మాతృత్వం వహించబోతున్నది. స్త్రీ జీవితంలో మాతృత్వ కార్యనిర్వహణఘట్టం కంటే సుందరమైనది మరొకటి లేదు. స్త్రీజీవితములో అది ఒక రమణీయతా ప్రతిపాదకమైన పరివర్తనం. అది ఒక మధురమైన భారం.

కాంతం విస్తారం మాట్లాడలేదు. నమస్కరిస్తూ ఒకచూపుతో సెలవుపుచ్చుకొన్నది. ఆచూపులో కించిత్ మాధుర్యమూ కించిత్ భయమూ

ఉన్నవి. సిగ్గు ముసుగును తొలగించుకొని వచ్చిన ఆ చూపు నన్ను ఒక అనిర్వచనీయమైన ఆనందంలో ముంచినది. నా ఆత్మను కలత పెట్టినది.

రైలులో కూర్చుని కిటికీలోనుంచి బైటకు చూస్తున్నాను. తాంబూల సేవనవల్ల అరుణములైన లేత బాలింత పెదవులవలె ఆకాశం అంతా ఎర్రబడ్డది. రైలు వేగంగా నడిచింది.

ఇంతలో వెన్నెల వచ్చింది కాంతం ముఖ దర హాస కాంతి పరివేషమూ, నేత్ర రోచిర్మండలమూ, నిర్మల యశస్సాంద్ర వీచికా సముదయమూ, ఏకీభూతమై వెన్నెలయై, సుమనోహరమై ప్రకాశిస్తున్నది.

ఆ వెన్నెలలో ఆకాశం మనోజ్ఞంగా ఉంది. లోకంలో సంసారాల్లో జరిగే శృంగారలీలలన్నీ అక్కడ ఛాయారూపాలలో చిత్రితమైనవి. కోపించి పోతూ ఉన్న భర్త ఉత్తరీయాంచలమును పట్టి లాగుతూ బ్రతిమి లాడుతున్నది ఒక్క మేఘవధూరత్నము, మరొక్క చోట భార్యాభర్తలు పరస్పరాలింగనంలో నిద్రామ త్తులై కదలకుండా ఉన్నట్లున్నది. మెరుస్తూ ఉన్న జరీ అంచులుగల తెల్ల చీరకట్టిన మందగమనను ప్రియుడు

సమీపించి మేలిముసుగు తొలగిస్తున్నట్లుంది ఒకచోట. జీరాడు చీరకొంగులను పట్టుకొని కోలాడు పిల్లలను బుజ్జగిస్తూ వెంటబెట్టుకొని పోతున్నది ఒక మొయిలు ముత్తయిదువ. నడువలేక నడువలేక నడుస్తున్నవి కొన్ని గర్భిణీ మేఘాలు. బృందావనంలో కృష్ణుడుజన్మించాడని విని రంగురంగుచీరలు ధరించి వస్తూఉన్న యాదవ పేరటాండ్రవలె మబ్బులు ఆకాశవీధిలో సంతోషంతో నడుస్తున్నవి. ఆ దాంపత్య శృంగార లీలలను ఆకాశవీధిలో చూస్తూ, కాంతంతో అనుభవించిన మధురమైన ఘట్టాలను స్మరణకు తెచ్చుకొంటూ కూర్చున్నాను. రైలు బహువేగంగా నడిచింది.

పండిత డి. గోపాలాచార్యులవారి

# జీవామృతము

1898 స॥నుండి భారతవర్షమునందంతటను ప్రసిద్ధిలోనున్న

## ఆరోగ్య ప్రదాయిని




జీవామృతము వాడుటవల్ల
బలహీన దేహములకు బలమును,
దుర్బలవీర్యులకు పటుత్వమును
నిద్రాహీనులకు సుఖనిద్రయు,
నరములపోగుకు కండపుష్టియు,
మందకొడిగ నుండువారికి ఉల్లాసమును,
జీర్ణశక్తి లేనివారికి జఠరదీప్తియు,
రక్తహీనులకు క్రొత్త ఎఱ్ఱటి రక్తమును,
జ్ఞాపకహీనులకు జ్ఞాపకశక్తియు,
పాలిపోయినవారికి తేజస్సును,

మొదలగు అసంఖ్యాకములైన సుగుణములెన్నియో కలుగును. స్త్రీపురుషులెల్లరు వయోభేదము లేక ఎల్లకాలమందును సేవింపదగిన దివ్యమైన టానిక్కు జీవామృతము.

## ఆయుర్వేదాశ్రమము - మదరాసు.

# ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్,

హెడ్డాఫీసు:—మచిలీపట్నం

## విశ్వాసాన్ని పురికొల్పే..............

## యథార్థ విషయాలు

1944 రెన్యూవల్ ఆదాయవ్యయ 'దామాయిషా 7½%

ఇండియా అంతటిలో తక్కువ

క్రొత్త వ్యాపారము......దాదాపు ఒకకోటి.

ఆంధ్ర ఇన్సూరెన్సు పట్టాలు మీడబ్బుకు ప్రశస్తమైన ప్రతిఫలం ఇచ్చును.

వివరములకు:— సెక్రిటరీ,

ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

మచిలీపట్నం.

మాఆఫీసులు:— మద్రాస్, కలకత్తా, నాగపూరు, బరంపూరు, అనంతపురం, ఎర్నాకులం, బెజవాడ, లాహోర్, జంషెడ్‌పూర్, శికింద్రాబాద్.

ఆయుర్వేద భూషణ పండిత నోరి రామశాస్త్రిలవారి

# క్షీరవర్ధని.

బిడ్డలకు పాలిచ్చు తల్లులును, దాదులును సేవింపదగిన తియ్యని రసాయనము, ఇది స్తన్యమును (చనుబాలను) వృద్ధిచేయును. తల్లి శరీరములోని జబ్బులను పోగొట్టి బిడ్డలకు స్వాభావికమై, తృప్తికరమై, ప్రియమై, ఆరోగ్యప్రదమై, సర్వవిధముల హితకరమైన యాహారమగు స్తన్యమును తృప్తిగ లభింపజేసి, తల్లికి బిడ్డకు నేక కాలమున ఆరోగ్యమును, బలమును కలిగించును. కాన పిల్లలు, తల్లులుగూడ సౌఖ్యముగా నుండుటయేగాక, తాత్కాలిక తృప్తి నిచ్చు నితర పోతపాలను వాడుటవలన గలుగు అజీర్ణము, లివరు, ప్లీహను మొదలగు వ్యాధులు రాకుండ బిడ్డలు రక్షింపబడుదురు.

పథ్యములేదు. వెల బుడ్డి 1కి రు 2—8—0.

# జీవనవటి

(పిల్లలకు పెద్దలకు శారీరక మానసిక ఆరోగ్యదాయిని)

మనోవ్యాపారము, అధికవ్యాయామము, జ్వరము, సన్నిపాతము, క్షయ, శుక్లనష్టము, ప్రసవము, మొదలగువానిచే గలుగు బలహీనమును పోగొట్టును. జీర్ణశక్తిని వృద్ధిచేసి మలబద్ధమును పోగొట్టును. నరములకు పుష్టిని, శుక్రాదిధాతువులకు శక్తిని, హృదయమునకు బలమును కలిగించును. (హిస్టీరియా మొదలయిన) సమస్త రోగములను పోగొట్టును. శీఘ్రస్ఖలనమును పోగొట్టును. పుంస్త్వమును చక్కబరచును. వెల బుడ్డి 1కి రు 5—0—0.

మావద్ద సమస్త ఆయుర్వేద ఔషధములు దొరకును. సమస్తవ్యాధులకు చికిత్స చేయబడును.

ఆయుర్వేదనిలయం & క్షీరవర్ధని, లేబరేటరీ, బెజవాడ.

# FAMOUS FILMS CIRCUIT

MOTION PICTURE DISTRIBUTORS

## H. O. NELLORE

*Branches:—*

BEZWADA.
GUNTAKAL.

Tel: "FAMOUS"
Office: BRUNDAVAN.

Book Now

*Our latest spectacular masterpieces in Hindi*

1. MAHARATHIKARNA



2. PHOOL or FLOWER



3. TARAMATHI



4. LAILA MAJUNU



5. VILLAGE GIRL



6. BHAIJAN.

TELUGU:—

Balaji or Venkateswara Mahathyam.
Dharmapathni.
Krishna Prema.
Bhagya Lakshmi.
Harischandra.
Sarangadhara.
Chandrahasa.
Bhale Pelli & Tarumaru
Chitranaliam.
Tulasi.
Kalachakram.

HINDI:—

Age kadam.
Dil-ki-Bhat,

# ప్రకటన కథ.

ఏం వదినా ఇంకా అల్లాగే ఉన్నావేం ?

ఎంతకాలము ఇంకా? నీవు పిల్లను కనటం ఎప్పుడు మా అబ్బాయికి చేమకోటం ఎప్పుడు ? అన్నది రాజమ్మ,

సీతమ్మ విచారంగా అన్నదీ "పిల్లలసంగతి దేవుడెరుగు బహిష్టు అయినప్పుడు నడుము మెలేసుకుపోతుంది వదినా. ఏవో మందులు పుచ్చుకొంటున్నాను గాని, ఏమీ గుణం లేదు".

ఈ మాటలువిని రాజమ్మ, సీతమ్మ చెవులో ఏదో గుస గుసలాడి వెళ్లిపోయింది.

తరువాత మూడు నెలలసంగతి. రాజమ్మ సీతమ్మతో ఇలా అన్నది, 'ఏం వదినా ఎల్లాగున్నావు? చెక్కిళ్లు తెల్లబడ్డవి!!

వాళ్లు ఇద్దరూ నవ్వుకొన్నారు. రాజమ్మ అన్నదీ, 'నేను చెప్పలేదు వదినా, లోధ్ర పుచ్చుకొంటే అన్ని సర్దుకొంటయి అని !!'

నేను చెప్పినట్లు పనిచేసిందా లేదా ? లోధ్ర తమాషా అయిన మందువదినా !.

రాజమ్మ ఆరోజునుంచీ ఆమె అందరికీ చెప్పటం సాగించింది తన వదిన కడుపునొప్పి లోధ్ర మందువలన నయమైంది అనీ, తనకొడుక్కు పెండ్లామూ పుట్టబోతున్నదనీ !

సీతమ్మ కన్నది.

రాజమ్మ వదినను బుగ్గాబుగ్గా పొడిచి 'నాకొడుక్కు పెండ్లాన్ని కనమంటే మొగపిల్లవాణ్ణి కన్నావా ? ఎంతగడుసు దానివే' అన్నది.

సీతమ్మ సిగ్గుతో తలవంచుకొని, క్షమించవమ్మా ఈతఫా నీమాట తప్పకుండా జ్ఞాపకం ఉంచుకొంటాను వదినా అన్నది.

---

# ది ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్

స్థాపితము 1923.

హెడ్ ఆఫీసు :— మచిలీపట్నము

మదాసు బ్రాంచి : 378 ఎస్ప్లనేడు

ఇతర బ్రాంచీలు: బెజవాడ, కాకినాడ, ఏలూరు, గుంటూరు, నెల్లూరు, రాజమండ్రి, తెనాలి, విజయనగరం అనకాపల్లి బ్రాడీపేట (గుంటూరు) చీరాల, దుగ్గిరాల, గవర్నరుపేట (బెజవాడ) గుడివాడ, నర్సారావుపేట, ఒంగోలు, సామర్లకోట, రామారావుపేట (కాకినాడ)

## త్వరలో వెలువడు ఆఫీసులు

విశాఖపట్నము, పాలకొల్లు- తుని- వినుకొండ- గూడూరు, (నెల్లూరుజిల్లా)

| | | |
|---|---|---|
| నిర్ణయింపబడి జారీచేయబడిన చందాల మూలధనం | రు. | 25,00,000 |
| చెల్లించిన మూలధనం | రు. | 12,98,600 |
| రిజర్వులు | రు. | 1,50,000 |
| డిపాజిట్లు వగైరా (30-6-45 వరకు) | రు. | 1,43,11,000 |

అన్నివిధములైన బ్యాంకింగు వ్యాపారములు చేయబడును.

వారణాసి కృష్ణమూర్తి,

M. A. B. Com L. L. B., C. A. I. I. B.

జనరల్ మేనేజరు.

# THE METROPOLITAN INSURANCE COMPANY Ltd

(Head Office : CALCUTTA)

THE MOST PROGRESSIVE INDIAN LIFE OFFICE OF ITS AGE

**Spectacular Progress during the year 1944.**

| | | | |
|---|---|---|---|
| Total Business in Force | over | Rs. | 5,07,94.000 |
| Nsw Business Completed | ,, | ,, | 2,13,52.300 |
| Total Assets | ,, | ,, | 56,31'000 |
| Life Fund | ,, | ,, | 51,80,000 |
| Claims Paid | ,, | ,, | 14,56.000 |
| Premium Incame | ,, | ,, | 25 15 000 |

Applications are invited for representation of this progressive Life Office on attractive terms.

For particulars, please apply to :—

**Mr P. Rangiah,**

Special Officer

MASULIPATAM.

Publisher:— మునిమాణిక్యం నరసింహారావు,

**Masulipatam.**

రుక్కుతల్లి

యథార్థదృశ్యాలు

కాంతం

రాధ బాబు

నవ్యసాహిత్య పరిషత్తు

గుంటూరు

1000 కాపీలు

Menarva
Press
Masulipatam




వినోదానికీ విజ్ఞానానికీ సహజత్వానికీ సంస్కృతికీ
ఇదే లాంఛనము! వాహినీవారి చిత్రలాంఛనము !!

ప్రజానీకాన్ని ఆనందింపజేసి
ప్రజాభిమానాన్నీ, ఆదరాన్నీ చూరగొన్న
వాహినీ చిత్రాలు

వందేమాతరమ్ : సుమంగళి
దేవత : భక్తపోతన : స్వర్గసీమ

ఉత్తమ చిత్రాన్ని చూడదలచుకొన్నప్పుడు
♦ ♦ వాహినీ చిత్రాన్ని మరిచిపోకండి ♦ ♦

---

## వాహినీ పిక్చర్సు లిమిటెడ్

మద్రాసు :: బెజవాడ :: తాడిపత్రి